# అథ అష్టత్రింశోऽధ్యాయః

# భద్రకాళీ శంఖచూడుల యుద్ధము

సనత్కుమార ఉవాచ |

సా చ గత్వా హి సంగ్రామం సింహనాదం చకార హే | దేవ్యాశ్చ తేన నాదేన మూర్చామాపుశ్చ దానవాః ||1

అట్టాట్ట హాసమశివం చకార చ పునః పునః | తదా పపౌ చ మాధ్వీకం ననర్త రణమూర్ధని || 2

ఉగ్రదంష్ట్రా చోగ్రదండా కోటవీ చ పపౌ మధు | అన్యాశ్చ దేవ్యస్తత్రాజౌ ననృతుర్మధు సంపపుః || 3

మహాన్ కోలాహలో జాతో గణదేవదలే తదా | జహృషుర్బహు గర్జంతస్సర్వే సురగణాదయః || 4

దృష్ట్వా కాలీం శంఖచూడశ్శీఘ్రమాజౌ సమాయ¸° | దానవాశ్చ భయం ప్రాప్తా రాజా తేభ్యోऽభయం దదౌ || 5

కాలీ చిక్షేప వహ్నిం చ ప్రలయాగ్నిశిఖోపమమ్ | రాజా జఘాన తం శీఘ్రం వైష్ణవాంకిత లీలయా || 6

నారాయణాస్త్రం సా దేవీ చిక్షేప తదుపర్యరమ్| వృద్ధిం జగామ తచ్ఛస్త్రం దృష్ట్వా వామం చ దానవమ్ || 7

సనత్కుమారుడిట్లు పలికెను-

చిక్షేప శక్తిం సూర్యాభాం దానవేంద్రస్య వక్షసి | తత్ప్రహారేణ సంప్రాప మూర్చాం దీర్ఘతమేన చ || 8

ముహూర్త మాత్రం తత్క్లేశం వినీయ స మహాబలః | చేతనాం ప్రాప్య చోత్తస్థౌ జగర్జ హరివర్చసః || 9

శక్త్యా జఘాన తం చాపి కార్తికేయం మహాబలమ్ | స పపాత మహీపృష్ఠేऽమోఘాం కుర్వన్ విధిప్రదామ్ || 10

కుమారస్వామి పార్వతీ పరమేశ్వరుల పాదములను స్మరించి శస్త్రములను అస్త్రములను తీసుకొని భయంకరమగు యుద్ధమును చేసెను (29). శివపుత్రుడగు స్కందుడు కోపముతో దివ్యాస్త్రమును ప్రయోగించి సర్పములు, పర్వతములు, వృక్షములు, రాళ్లు మొదలగు వాటినన్నిటిని చెదరగొట్టెను (30). ఆతడు అగ్నిని పర్జన్యాస్త్రముతో చల్లార్చి, శంఖచూడుని రథమును, ధనస్సును, సర్వవాహనములను, ప్రకాశించే కిరీటమును పడగొట్టి సింహనాదమును చేసి పలుమార్లు గర్జించెను (32). మరియు దానవచక్రవర్తియగు శంఖచూడుని వక్షస్థ్సలముపై సూర్యకాంతి గల శక్తితో కొట్టగా బలమగు ఆ దెబ్బచే ఆతడు మూర్ఛిల్లెను (33). సింహము యొక్క వర్చస్సు గలవాడు, మహాబలుడు అగు ఆ శంఖచూడుడు ఆ క్లేశమును కొద్ది సమయములో పోగొట్టుకొని తెలివిని పొంది లేచి నిలబడి గర్జించెను (34). మరియు ఆతడు మహాబలుడగు స్కందుని శక్తితో కొట్టెను. బ్రహ్మచే ఈయబడిన ఆ శక్తిని నిర్వీర్యము చేయనిచ్ఛగించని వాడై ఆతడు నేలపై బడెను (35).

ఆమె యుద్ధరంగమునకు వెళ్లి సింహనాదమును చేసెను. ఆ దేవియొక్క నాదమును తాళజాలక దానవులు మూర్ఛను పొందిరి (1). ఆమె అమంగళకరమగు అట్టహాసమును పలుమార్లు చేసి మధువును త్రాగి యుద్ధరంగములో నాట్యము చేసెను (2). ఉగ్రదంష్ట్ర, ఉగ్రదండ, కోటవి అను పేర్లుగల దేవీ మూర్తులు కూడ ఇతర దేవీమూర్తులతో గూడి ఆ యుద్ధములో మధువును అధికముగా త్రాగి నాట్యమాడిరి (3). శివగణములలో మరియు దేవతల దళములలో అపుడు పెద్ద కోలాహలము బయలు దేరెను. దేవతలు, గణములు మరియు ఇతరులు అందరు అధికముగా గర్జిస్తూ ఆనందించిరి (4). కాళిని చూచి శంఖచూడుడు వెంటనే యుద్ధమునకు వచ్చెను. భయమును పొందియున్న దానవులకు ఆ రాక్షసరాజు అభయమునిచ్చెను. (5) కాళి ప్రళయకాలాగ్నిని బోలిన అగ్నిని విరజిమ్మెను. కాని ఆ దానవేంద్రుడు దానిని వెంటనే వైష్ణవాస్త్రముతో అవలీలగా త్రిప్పికొట్టెను (6). అపుడా దేవి వెంటనే అతనిపై నారాయణాస్త్రమును ప్రయోగించెను. ఆ దానవ వీరుని గాంచి ఆ అస్త్రము వర్ధిల్లెను (7).

తం దృష్ట్వా శంఖచూడశ్చ ప్రలయాగ్ని శిఖోపమమ్ | పపాత దండవద్భూమౌ ప్రణనామ పునః పునః || 8

నివృత్తిం ప్రాప తచ్చాస్త్రం దృష్ట్వా నమ్రం చ దానవమ్ | బ్రహ్మాస్త్రమథ సా దేవీ చిక్షేప మంత్రపూర్వకమ్|| 9

తం దృష్ట్వా ప్రజ్వలంతం చ ప్రణమ్య భువి సంస్థితః | బ్రహ్మాస్త్రేణ దానవేంద్రో వినివారం చకార హ || 10

అథ క్రుద్ధో దానవేంద్రో ధనురాకృష్య రంహసా | చిక్షేప దివ్యాన్యస్త్రాణి దేవ్యై వై మంత్రపూర్వకమ్ ||11

ఆహారం సమరే చక్రే ప్రసార్య ముఖమాయతమ్ | జగర్జ సాట్టహాసం చ దానవా భయమాయయుః || 12

కాల్యై చిక్షేప శక్తిం స శతయోజనమాయతామ్ | దేవీ దివ్యాస్త్ర జాలేన శతఖండం చకార సా || 13

స చ వైష్ణవమస్త్రం చ చిక్షేప చండికోపరి | మాహేశ్వరేణ కాలీ చ వినివారం చకార సా || 14

ప్రళయకాలాగ్ని జ్వాలను బోలియున్న ఆ అగ్నిని గాంచి శంఖచూడుడు దండమువలె నేలపై బడి పలుమార్లు ప్రణమిల్లెను (8). వినీతుడై యున్న దానవుని ంచి ఆ ఆయుధము వెనుదిరిగెను. అపుడా దేవి మంత్రమును పఠించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను (9). ఆ దానవవీరుడు నిప్పులు గ్రక్కు చున్న దానిని గాంచి నేలపై నిలబడి ప్రణమిల్లి బ్రహ్మాస్త్రముతో దానిని తప్పించెను (10). అపుడా దానవవీరుడు కోపించి వేగముగా ధనుస్సును ఎక్కుపెట్టి మంత్రములను పఠిస్తూ దేవిపై దివ్యాస్త్రములను ప్రయోగించెను (11). ఆమె విశాలమగు నోరును తెరచి ఆ అస్త్రమును ఆహారమును వలె భుజించి గర్జించి అట్టహాసమును చేయగా దానవులు భయపడిరి (12). ఆతడు వందయోజనముల వెడల్పు గల శక్తిని కాళిపై ప్రయోగించగా, ఆ

దేవి అనేక దివ్యాస్త్రములతో దానిని వంద ముక్కలుగా చేసెను (13). ఆతడు చండికపై వైష్ణవాస్త్రమును ప్రయోగించగా, ఆమె మహేశ్వరాస్త్రముతో దానిని తప్పించెను (14).

ఏవం చిరతరం యుద్ధమన్యోన్యం సంబభూవ హ | ప్రేక్షకా అభవన్ సర్వే దేవాశ్చ దానవా అపి || 15

అథ క్రుద్ధా మహాదేవీ కాలీ కాలసమా రణ | జగ్రాహ మంత్రపూతం చ శరం పాశుపతం రుషా || 16

క్షేపాత్పూర్వం తన్నిషేద్ధుం వాగ్బభూవాశరీరిణీ | న క్షిపాస్త్రమిదందేవి శంఖచూడాయ వై రుషా || 17

మృత్యుః పాశుపతాన్నాస్త్యమోఘాదపి చ చండికే | శంఖచూడస్య వీరస్యోపాయమన్యం విచారయ || 18

ఇత్యాకర్ణ్య భద్రకాళీ న చిక్షేప తదస్త్రకమ్ | శతలక్షం దానవానాం జఘాన లీలయా క్షుధా || 19

అత్తుం జగామ వేగేన శంఖచూడం భయంకరీ | దివ్యాస్త్రేణ చ రౌద్రేణ వారయామాస దానవః || 20

అథ క్రుద్ధో దానవేంద్రః ఖడ్గం చిక్షేప సత్వరమ్| గ్రీష్మ సూర్యోపమం తీక్ష్ణ ధారమత్యంతభీకరమ్ || 21

ఈ తీరున వారిద్దరి మధ్య చిరకాలము యుద్ధము జరిగెను. దేవదానవులందరు ప్రేక్షకులుగా నుండి పోయిరి (15). అపుడు యుద్ధములో మృత్యుసమానురాలగు కాళీమహాదేవి కోపించి మంత్రముచే పవిత్రమైన పాశుపతాస్త్రమును స్వీకరించెను (16). దానిని ప్రయోగించుటకు పూర్వమే ఆపివేయుటకై ఆకాశవాణి ఇట్లు పలికెను : ఓ దేవీ! కోపముతో ఈ అస్త్రమును శంఖచూడునిపై ప్రయోగించకుము (17). ఓ చండికా! పాశుపతాస్త్రము అమోఘమైనదే అయినా వీనికి దానివలన మరణము రాదు. వీరుడగు శంఖచూడుని వధించుటకు మరియొక ఉపాయము నాలోచించుము (18). ఈ మాటను విని భద్రకాళి ఆ అస్త్రమును

ప్రయోగించలేదు. అపుడామె ఆకలితో కోటి మంది దానవులను అవలీలగా తినివేసెను (19). భయంకరురాలగు ఆమె శంఖచూడుని భక్షించుటకై వేగముగా పరుగెత్తెను. ఆ దానవుడు దివ్యమైన రౌద్రాస్త్రముతో ఆమెను ఆపి వేసెను (20). అపుడు దానవవీరుడు కోపించి, గ్రీష్మకాలము నందలి సూర్యుని బోలిన పదునైన మిక్కిలి భయంకరమగు ఖడ్గమును వేగముగా ప్రయోగించెను (21).

సా కాలీం తం సమాలోక్యాయాంతం ప్రజ్వలితం రుషా | ప్రసార్య ముఖమాహారం చక్రే తస్య చ పశ్యత ః|| 22

దివ్యాన్యస్త్రాణి చాన్యాని చిచ్ఛేద దానవేశ్వరః | ప్రాప్తాని పూర్వతశ్చక్రే శతఖండాని తాని చ || 23

పునరత్తుం మహాదేవీ వేగతస్తం జగామ హ | సర్వసిద్ధేశ్వరశ్శ్రీమానంతర్ధానం చకార సః || 24

వేగేన ముష్టినా కాలీ తమదృష్ట్వా చ దానవమ్ | బభంజ చ రథం తస్య జఘాన కిల సారథిమ్ || 25

అథాగత్య ద్రుతం మాయీ చక్రం చిక్షేప వేగతః | భద్రకాల్యై శంఖచూడః ప్రలయాగ్నిశిఖోపమమ్ || 26

సా దేవీ తం తదా చక్రం వామహస్తేన లీలయా | జగ్రాహ స్వముఖేనైవాహారం చక్రే రుషా ద్రుతమ్ || 27

ముష్ట్యా జఘాన తం దేవీ మహాకోపేన వేగతః | బభ్రామ దానవేంద్రో%పి క్షణం మూర్ఛామవాప సః|| 28

క్షణ   న చేతనాం ప్రాప్య స చోత్తస్థౌ ప్రతాపవాన్ | న చక్రే బాహుయుద్ధం చ మాతృబుద్ధ్యా తయా సహ || 29

గృహీత్వా దానవం దేవీ భ్రామయిత్వా పునః పునః | ఊర్ధ్వం చ ప్రాపయామాస మహాకోపేన వేగతః || 30

ఆ కాళి నిప్పులు చెరుగుతూ తన మీదకు వచ్చుచున్న ఆ కత్తిని గాంచి కోపముతోనోటిని తెరిచి, శంఖచూడుడు చూచుచుండగా, నమిలి వేసెను (22). దానవవవీరుడగు ఆతడు ఇతరములగు దివ్యాస్త్రములను ప్రయోగించెను. కాని ఆమె వాటిని తనను చేరుటకు ముందే ముక్కముక్కలుగా చేసెను (23). తరువాత ఆ మహాదేవి ఆతనిని భక్షించుటకై వేగముగా మీదకు వెళ్లెను. కాని శోభాయుక్తుడు, సిద్ధులందరిలో గొప్ప వాడునగు ఆ శంఖచూడుడు అంతర్ధానమును చెందెను (24). ఆ శంఖచూడుని గాన రాక, కాళి వేగముగా తన పిడికిలితో వాని రథమును విరుగగొట్టి సారథిని సంహరించెను (25). తరువాత మాయావి యగు శంఖచూడుడు వేగముగా మరలి వచ్చి భద్రకాళిపై ప్రలయకాలాగ్ని జ్వాలలను బోలియున్న చక్రమును వేగముగా ప్రయోగించెను (26). అపుడు దేవి ఆ చక్రమును ఎడమచేతితో అవలీలగా పట్టుకొని కోపముతో వెంటనే నోటిలో వేసుకొని భక్షించెను (27). ఆ దేవి మిక్కిలి కోపముతో వేగముగా వానిని పిడికిలితో కొట్టగా, ఆ దానవవీరుడు గిరగిర తిరిగి క్షణకాలము మూర్ఛల్లెను (28). ప్రతాపశాలియగు ఆ శంఖచూడుడు మరుక్షణములో తెలివిని పొంది లేచి నిలబడెను. ఆమె యందు తల్లి యను భావన కలవాడగుటచే ఆమెతో బాహుయుద్ధమును ఆతడు చేయలేదు (29). ఆ దేవి మహాకోపముతో ఆ దానవుని పట్టుకొని పలుమార్లు గిరగిర త్రిప్పి పైకి వేగముతో విసిరివేసెను (30).

ఉత్పపాత చ వేగేన శంఖచూడః ప్రతాపవాన్ | నిపత్య చ సముత్తస్థౌ ప్రణమ్య భద్రకాలికామ్ || 31

రత్నేంద్రసారనిర్మాణం విమానం సుమనోహరమ్ | ఆరురోహ స హృష్టాత్మాన భ్రాంతో%పి మహారణ || 32

దానవానాం హి క్షతజం సా పపౌ కాలికా క్షుధా | ఏతస్మి న్నంతరే తత్ర వాగ్బభూవాశరీరిణీ || 33

లక్షం చ దానవేంద్రాణా మవశిష్టం రణ %ధునా | ఉద్ధతం గుంజతాం సార్ధం తతస్త్వం భుంక్ష్వ చేశ్వరి || 34

సంగ్రామే దానవేంద్రం చ హంతుం న కురు మానసమ్ |
అవధ్యోఽయం శంఖచూడస్తవ దేవీతి నిశ్చయమ్ || 35

తచ్ఛ్రుత్వా వచనం దేవీ నిస్సృతం వ్యోమమండలాత్ | దానవానాం బహూనాం చ మాంసం చ రుధిరం తథా || 36

భుక్త్వా పీత్వా భద్రకాళీ శంకరాంతిక మాయ¸° | ఉవాచ రణవృత్తాంతం పౌర్వా పర్యేణ సక్రమమ్ || 37

ఇతి శ్రీ శివమహాపురాణ   రుద్రసంహితాయాం యుద్ధఖండే కాళీయుద్ధవర్ణనం నామ అష్టత్రింశోఽధ్యాయః (38).

ప్రతాపవంతుడగు శంఖచూడుడు వేగముగా పైకి ఎగిరి మరల క్రిందకు దిగి నిలబడి భద్రకాళికకు ప్రణమిల్లెను (31). ఆతడు ఆనందముతో నిండిన మనస్సు గలవాడై శ్రేష్ఠమగు రత్నములతో గొప్ప కౌశలముతో నిర్మించబడిన మిక్కిలి అందమగు విమానము నధిరోహించెను. ఆ మహాయుద్ధములో ఆతడు కంగారు పడలేదు (32). ఆ కాళి ఆకలితో దానవుల రక్తమును త్రాగెను. ఇంతలో అచట ఆకాశవాణి ఇట్లు పలికెను (33). ఇంకనూ గర్వించి యున్న లక్ష మంది దానవవీరులు గర్జిస్తూ యుద్ధరంగములో మిగిలి యున్నారు. ఓ ఈశ్వరీ! నీవు వారిని భక్షించుము (34). యుద్ధములో శంఖచూడుని సంహరించవలెనని కోరకుము. ఓదేవీ! ఆ దానవవీరుడు నీ చేతిలో మరణించడు. ఇది నిశ్చయము (35). ఆకాశమునుండి వెలుబడిన ఆ పలుకులను విని ఆ భద్రకాళీదేవి అపుడు అనేకమంది దానవుల రక్తమును త్రాగి మాంసమును తిని శంకరుని సన్నిధికి వచ్చి యుద్ధములో జరిగిన ఘటనలను ముందు వెనుకల క్రమమును తప్పకుండ చెప్పెను (36, 37).

శ్రీ శివమహాపురాణములోరుద్రసంహితయందలి యుద్ధఖండలో కాళీయుద్ధవర్ణనమనే ముప్పది ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (38).